# చిన్నారి సాహసి చిలక

## జాతక కథ



# చిన్నారి సాహసి చిలక

## జాతక కథ





అనగనగా ఒక పచ్చటి అడవిలో ఒక చిన్నారి చిలక ఉండేది.





ఒక రోజు ఆకాశంలో దట్టంగా నల్లటి మబ్బులు కమ్ముకున్నాయి. మెరుపులు మెరిశాయి, ఉరుములు ఉరిమాయి. పిడుగుకి ఒక ఎండిన చెట్టు రాజుకుంది. అంతలోనే మంటలు ఒక చెట్టు నుంచి మరొక చెట్టుకి వ్యాపించసాగాయి.



పొగ వాసనకి, “మంటలు!" అంటూ చిలక అరిచింది. “మంటలు! నది వైపుకి పరిగెత్తండి!" అంటూ రెక్కలార్చి సురక్షితమైన నదీ తీరానికి చేరుకుంది. అది పక్షి కాబట్టి వేగంగా ఎగిరిపోగలిగింది.

ఎగురుతున్నప్పుడు కింద పెద్ద పెద్ద చెట్లు కాలిపోవటం అది చూసింది. చాలా జంతువులు తప్పించుకునే దారి లేక ఆ మంటల మధ్య చిక్కుకుపోవటం అది చూసింది. వాటిని కాపాడటానికి దానికి ఒకే ఒక్క మార్గం కనిపించింది.







చిన్నారి చిలక నదిని చేరుకుంది. ఆపాటికే అక్కడికి చాలా జంతువులు చేరుకుని ఉన్నాయి.

“ఏనుగుల్లారా, మీ తొండాలను నీటితో నింపి మంటల మీద చల్లండి! మిగిలిన జంతువులం నీళ్లల్లో మునిగి మంటలమీద ఆ నీటిని చల్లుతాం. ఆకు దోనెలలో కూడా నీళ్లు తీసుకుని వెళ్లవచ్చు. అందరం కలిసి అడవిని, మన మిత్రులను కాపాడదాం!"

అయితే నదీతీరాన ఉన్న జంతువులు, “చిన్నారి చిలకా, మనం చెయ్యగలిగింది ఏమీ లేదు, ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది,” అంటూ విచారాన్ని వ్యక్తపరిచాయి.

“అవును," దగ్గుతూ అంది చిరుత. “నేను వేగంగా పరిగెత్తగలను, కానీ మంటలు ఇంకా వేగంగా వ్యాపిస్తున్నాయి."

“మాకు బలమున్న మాట నిజమే," ఏనుగులు ఘీంకరించాయి, “అయినా మేం ఆ మంటలలోంచి దూసుకుని వెళ్లలేం."

“పరిస్థితి చేయి జారిపోయింది," జంతువులన్నీ అంగీకరించాయి.





కానీ చిన్నారి చిలకకి ఇంకా ఆశ ఉంది. అది తన ఒంటిని నీళ్లల్లో ముంచి, దోసెలో నీటిని తీసుకుని మంటల వైపుకి ఎగిరింది.

మంటలు దానివైపు ఎగిశాయి. వేడి సెగ సోకింది, పొగ లుంగలు చుట్టుకుంది. మంటలు ఒకసారి ఒకవైపుకి, మరొకసారి మరొకవైపుకి పైకి ఎగిసి పడుతూ ఉన్నాయి. ఆ మంటలలో నుంచి మెలికలు తిరుగుతూ చిన్నారి చిలక ధైర్యంగా ముందుకి ఎగురుతోంది.





మండుతున్న అడవి మధ్యకల్లా వెళ్లి ఆ చిలక తన రెక్కలను విదిలించింది. దాని ఈకలకు ఇంకా ఉన్న నీళ్లు ముత్యాల లాగా మంటల మీద రాలాయి. ఆకు దోనెలోని నీటిని కూడా అది ఒంపింది. స్స్స్స్స్ స్స్స మన్న శబ్దంతో అవి వెంటనే ఆవిరైపోయాయి!





చిన్నారి చిలక మళ్లీ నది వైపుకి ఎగిరింది. నీటిలో మునిగి, దోనెలో నీటిని నింపుకుంది.
“మాతోపాటు ఉండిపో, చిన్నారి చిలకా!" జింక బతిమాలింది, “మంటలలోకి మళ్లీ వెళ్లవద్దు!"





“అవును, ఉండిపో!" బలశాలి అయిన పులి అంది. “రగులుతున్న అడవిని కొన్ని నీటి చుక్కలు కాపాడలేవు!"

“చాలా ఆలస్యమైపోయింది!" మిగిలిన జంతువులు కూడా అరిచాయి. “క్షేమంగా ఇక్కడ ఉండిపో!"

“సాధ్యం అవుతుందేమొ, నా ప్రయత్న కొనసాగిస్తాను," వగరుస్తూ చిన్నారి చిలక అంది. మండుతున్న అడవి మీద మరొకసారి ఎగిరి రెక్కలను విదిల్చి, కొన్ని నీటి చుక్కలను రాల్చింది. స్‌స్‌స్‌స్‌స్‌స్‌స్.

అలా చిలక నది నుంచి అడవికి, అడవి నుంచి నదికి ఎగురుతూనే ఉంది. దాని కళ్లు ఎర్రగా అయ్యాయి, ఈకలు కాలాయి, కాలి వేళ్లు పగిలాయి. దగ్గుతోంది, ఊపిరి అందటంలేదు. అయినా అది తన ప్రయత్నం ఆపలేదు.



అదే సమయంలో కొందరు దేవతలు ఆకాశంలో వెళుతున్నారు. మేఘాల కోటలో వాళ్లు నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. తేనెలో ముంచిన పదార్థాలు తింటూ, సురాపానం చేస్తున్నారు. వాళ్లల్లో ఒకరు చిలకను చూశారు. “చూడండి!" అతను అన్నాడు. “కొన్ని నీటి చుక్కలతో అడవిలోని మంటను ఆర్పటానికి ప్రయత్నిస్తున్న ఆ పిచ్చి చిలకను చూడండి!"

“నవ్వు తెప్పిస్తోంది!" రెండవ దేవత అన్నాడు.

“అసాధ్యం!" మూడవ దేవత నవ్వాడు.

“వృధా ప్రయాస అని దానికి తెలియటం లేదు!" మొదటి దేవత ఆశ్చర్యపోయాడు.





చేతిలోని బంగారు పాత్రను పక్కన పెట్టి అతడు బంగారు గద్ద రూపం దాల్చాడు. తన విశాలమైన రెక్కలు ఆడిస్తూ ఆ గద్ద చిన్నారి చిలకవైపు ఎగిరింది.



అడవి మంట మధ్యకి చేరుతున్న చిలక పక్కకి చేరి, “చిన్నారి చిలక వెనక్కి వెళ్లిపో!" గంభీరమైన కంఠంతో అంది. “కొన్ని నీటి చుక్కలతో ఈ అడవి మంట ఆరదు. ఈ పని ఆపి, ఆలస్యం కాకముందే నిన్ను నువ్వు కాపాడుకో." కానీ, చిలక వెనక్కి తిరగలేదు, “అయ్యా!," దగ్గుతూ బదులిచ్చింది, “ఇప్పుడు సమయం లేదు. ఇప్పుడు కావలసింది సలహా కాదు, సహాయం!" చిలక తన ప్రయత్నం కొనసాగిస్తూనే ఉంది.

ఇది చూసి బంగారు గద్ద ఆశ్చర్యపోయింది. క్షణక్షణానికి మంట తీవ్రమౌతోంది. అది రెక్కలు ఆడించి పైకి చల్లటి గాలులలోకి వెళ్లింది.





కింద ఎగురుతున్న చిలక అతడికి కనపడింది. అడవి మండుతూ ఉండగా పైన మిగిలిన దేవతలు ఎప్పటిలాగే నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ, తింటూ తాగుతున్నారు. జీవితంలో మొదటిసారి ఆ దేవత తనని తాను అసహ్యించుకున్నాడు.

“మేం దేవతలం కదా!” అతడు అన్నాడు, “ఏదో ఒకటి చెయ్యాలి."

ఉన్నట్టుండి అతడు పెద్దపెట్టున ఏడ్వసాగాడు. అతడి కన్నీళ్లు కుండపోత వాన లాగా తెరలు, తెరలుగా మండుతున్న అడవి మీద, జంతువుల మీద, చిన్నారి చిలక మీద పడసాగాయి.





అప్పుడు ఏమయ్యింది? బంగారు గద్ద కన్నీటి చుక్కలు పడిన చోటల్లా మంటలు ఆరిపోయాయి! కాలిన కొమ్మలనుంచి మెరుస్తున్న బిందువులు కిందపడి నేలలోకి ఇంకిపోయాయి. అడవి నిశ్శబ్దంగా మారిపోయింది. అంతేకాదు, ఆ చుక్కలు పడిన చోటల్లా కొత్త జీవం అంకురించింది! మండుతున్న కణికల్లోంచి పచ్చని గడ్డి మొలిచింది. ఆకులు విప్పారాయి, పువ్వులు విరిసాయి.





చిన్నారి చిలక ఒంటి మీద కూడా కొత్త ఈకలు వచ్చాయి – మంటల్లాంటి ఎర్రటి ఈకలు, ఆకుల్లాంటి ఆకుపచ్చ ఈకలు, సూర్యకాంతి లాంటి పసుపు పచ్చ ఈకలు, నదిలాంటి నీలం రంగు ఈకలు! ఎంత అద్భుతమైన రంగులు! ఎంత అందమైన పక్షి!

“మంటలు ఆరిపోయాయి," చిన్నారి చిలక సంతోషంగా అరిచింది. “ప్రమాదం తప్పిపోయింది!"

జంతువులు ఒకదానినొకటి ఆశ్చర్యంగా చూసుకున్నాయి. ఆ కన్నీటితో అవి మళ్లీ మామూలుగా అయ్యాయి.

“సాహసి అయిన చిన్నారి చిలకకు జయహో! అద్భుతమైన వానకు జయహో!" జంతువులన్నీ అరిచాయి.



నీలాకాశంలో తమ స్నేహితుడైన చిన్నారి చిలక సంతోషంగా ఎగురుతోంది. దాని శక్తిమేరకు అది కృషి చేసింది, అది ఎలాగో తమందరినీ కాపాడింది.



